# గ్రేహాం స్టెయిన్స్

## జీవిత చరిత్ర



www.gospelneeds.com

# గ్రహాం స్టెయిన్స్
## జీవిత చరిత్ర

**The Incident which Blackens the Humanity**



A Gospelfamily Product



గాస్పల్ IND ఫ్యామిలి

www.gospelfamily.in

**www.gospel needs.com**

## సజీవ దహనం

ఒరిస్సాలో కుష్ఠురోగుల మధ్య సేవ చేస్తున్న గ్రెహం స్టూవర్ట్ స్టెయిన్స్ అయన యిద్దరు కుమారులు ఫిలిప్, తిమోతీలను దుండగులు సజీవ దహనం చేశారు. అది జనవరి 1999, 22వ తేదీ అర్థరాత్రి మనోహర్ పూర్, రాజధానికి 250 కి॥మీ దూరంలో కుగ్రామం. 150 సంతాల్ నివాసులుంటారు. ఆ రోజు ఆ ప్రాంతంలో అగ్ని జ్వాలలకు ఆహుతి చేసిన కిరాతకులనుగూర్చి, భారత రాష్ట్రపతి కె.ఆర్. నారాయణన్ చెప్పిన మాటలు "ఎన్నో సంవత్సరాలు కుష్ఠురోగుల కొరకు తమ జీవితాన్ని వెచ్చించి, సేవచేసిన వారికి కృతజ్ఞత చూపలేదు సరికదా, ఈ విధమైన మరణానికి అక్కడున్నవాళ్ళు కారకులయ్యారు. హిందూదేశం మత సహనానికి, మానవత్వానికి పెట్టినది పేరు. ఈ ఘాతుక చర్య ప్రపంచపు చీకటి క్రియల ఉత్పాదనేమో అనిపిస్తోంది."

## గ్రెహమ్ గారి బాల్యము - సేవ

గ్రెహమ్ తల్లిదండ్రుల పేర్లు విలియమ్, ఎలిజెబెత్‌లు గ్రెహంగారు భక్తిగలవారు గనుక వీరి ప్రభావము తన కుమారుని తాకింది. ప్రథమంలో తండ్రి త్రాగుబోతయినా చర్చికి వచ్చేవాడు. విశ్వాసిగానే ఉన్నాడు.



www.gospelneeds.com

కుమారుని ప్రేమించేవాడు. ఆస్ట్రేలియాలో క్వీన్స్‌లాండులో పామ్సుఉడ్ అనే ప్రాంతం అతని జన్మస్థలము. తన పదవ యేట సువార్త కూటంలో దైవ పిలుపునుగూర్చిన సందేశాలు అతనికి ఇష్టంగా ఉండేవి. ఒకరోజు గొప్ప ప్రసంగీకుడైన అలాన్ కన్నింగ్ వారి ప్రసంగము విని, తల్లి నేర్పిన ఆత్మీయ జ్ఞానంతో ఆ మాటలు శ్రద్ధతో ఆలకించి క్రీస్తును విశ్వసించినవారికి నాశనము లేదు, నిత్య జీవం కలదని బాల్యంలోనే నమ్మాడు. ఆ తర్వాత ప్రెసిబటేరియన్ చర్చిలో తన జీవితాన్ని సమర్పించుకున్నాడు. బాప్టిస్టు చర్చిలో బాప్తీస్మం తీసికొని విశ్వాసంలో నిలకడగా ఉండి మొదటిసారిగా మిషనెరీ పిలుపు తన జీవితంలో ముఖ్యమని గ్రహించాడు. దేవుని సంపూర్ణ చిత్తం గ్రహించాలని తలంచి కనిపెట్టి ప్రార్థించసాగాడు.

హిందూ దేశంలో ఒరిస్సాలోగల మయూర్ భంజ్‌లో మిషనెరీ స్త్రీ, అక్కడ పనిచేయు కుష్ఠురోగుల ఫోటోలు పరిచర్య స్లైడ్సుద్వారా చూపించింది. వారిలో జోషియా అనే కుష్ఠురోగి కొండ జాతివాని కళ్ళలో మరణభయం అతడు చూచినపుడు భారతంతో ప్రార్థింపసాగాడు. గ్రహం మార్కు సువార్తలో కుష్ఠరోగులనుగూర్చి చదివి కన్నీరు కార్చాడు. ఎందరో వైద్య సదుపాయంలేక నిత్యత్వం చేరకనే



www.gospelneeds.com

మరణిస్తున్నారన్న భావం గ్రెహంగార్ని తీవ్రంగా బాధించింది. మార్కు 1:42 యేసు కుష్ఠురోగితో సంభాషిస్తూ నా కిష్టమే నీవు శుద్ధుడవు కమ్ము" ఈ మాటలద్వారా గ్రెహం దేవుని పిలుపునందుకొని తన గతజీవిత ఉద్యోగాన్ని విరమించుకొని దేవుని సేవించుట ఉత్తమసేవగా ఎంచుకున్నాడు.

గ్రెహంగార్కి బంధువులద్వారా ఆటంకాలెదురయ్యాయి. చిన్నాన్నకు కొడుకులు లేనందున, పెద్ద ఉద్యోగం ఎరచూపి ఆ దేశంలోనే ఉండమని ప్రాధేయపడ్డాడు. ఈ శోధనలన్నీ జయించి రాజు బిడ్డ రాజకార్యాలే చేయగలడని గ్రహించాడు. గ్రెహమ్ గార్కి పరిచయమై ఒరిస్సా మిషనెరీ వేరా స్టీవెన్సు పరిచయం చేసిన కోయవాడు సంతానుసత్పలి. వీరిరువురి జన్మదినం ఒకేరోజు జనవరి18, 1941. 8 సంవత్సరాలుగా వీరు కలం స్నేహం చేపట్టి ఎన్నో కబుర్లు పంచుకొనేవారు. గ్రెహంగారికి 1965 సం॥ జనవరి నాటికి 24 సం॥ నిండాయి. బైబిలు స్టడీ 2 సం॥ల కోర్సు పూర్తయింది. 1965 సం॥ జనవరిలో గ్రెహం భారతదేశం చేరాడు. బిచ్చగాళ్ళు వీధుల్లో పండుకొనుట చూచి ఆశ్చర్యపడ్డాడు. గ్రెహం గారి పట్టుదల సేవా దృక్పథం సమర్పణ చెరగనిదని సంతాల్ చెప్తూ ఉంటాడు. ఐదుమంది చేసే పని ఒక్కడే చేస్తాడు. తనచుట్టూ చేరినవారి ఆత్మీయ చీకటికై విలపించేవాడు. ఆ ప్రాంతాలలో అనాగరీకులు మానవుల్ని బలిగా యివ్వడం, భూత వైద్యులు, దురాత్మలనుండి విడుదలకై కడ్డీకాల్చి నొసటిపై, ఉదర భాగంలో వాతలు పెట్టడంచూచి చాలా దుఃఖించేవాడు. క్రొత్త వంతెనలు నిర్మించే సమయంలో నరబలిగా మానవుని చంపి పునాదుల్లో పాతిపెట్టేవారు.

గ్రెహంగారు గొప్ప విశ్వాసమేమనగా ఎంత చీకటి శక్తుల పనులనైనా దేవుని వెలుగు పారద్రోలగలదు. మానవుల సమస్యలు పరిష్కరించేది యేసే. సమస్యకు పరిష్కారానికి మధ్య ఉండేది కేవలం ప్రార్థన. ఏ మానవుడు మరొక ప్రాణిని మార్చలేడు. కుష్ఠురోగి స్వస్థతకు మతమార్పిడికి చాలా వ్యత్యాసముంది అని భావించేవాడు. గ్రెహంగారి అభిప్రాయాలలో నిజమైన మారుమనస్సు నోటి మాటలతో కాదు. అది వివాహబంధంవంటిది. హృదయము, మనస్సు, చిత్తము సంపూర్ణంగా మారాలి. అది మానవ శక్తికి అతీతమైన మూలమునుండే రక్షణానుభవము సంభవిస్తుంది.

www.gospelneeds.com

గ్రహంగారు ఎప్పుడూ ఎవరినీ క్రైస్తవునిగా మార్చుటకు వస్తువులు, ధనాన్ని ఉపయోగించలేదు. పేదల నుండి డబ్బు తీసికొనేవాడు కాదు. చేతలు, మాటలు ఒకేలా ఉండేవి. అతని జీవితం తెరిచిన పుస్తకంలా స్పష్టంగా గాజులాగా ఉండేది. మత మార్పిడి అనే నిందవేసి ఆ నెపంతో ఘోర మరణానికి సజీవ దహనం చేసి అగ్నిజ్వాలలకు అమాయక ప్రాణుల్ని బలితీసికొన్నారు. ఎంత దారుణం! ఎంతటి హింస! ఎంత అమానుష చర్య! వీరి జీవితాలు సమసిపోయిన తీరుని వెలువడిన వార్త ప్రపంచాన్ని తీవ్రంగా కదలించి కన్నీటిమయం చేసినాయి. గ్రహం గారు క్రీస్తు మరణముతో పాలివాడయ్యాడు. సైఫనుకు సోదరుడయ్యాడు.

క్రీస్తును ద్వేషించినవారే సైఫను మరణాన్ని సమ్మతించారు. అట్లే ధర్మశాస్త్రాన్ని అతిక్రమించాడనీ, దైవ దూషణ చేసాడని, దూషకుడని, వంచకుడని నిందలు మోపి క్రీస్తును సిలువకెక్కించారు.

## వివాహం

గ్రహంగారు, గ్లాడిస్ వారిద్దరూ మిషనెరీ సేవ ద్వారా ఇండియాలో కలుసుకోగా 1983 ఆగష్టు 6వ తేది వివాహం చేసుకున్నారు. భార్య గ్లాడిస్ భర్తను ప్రశంసించేది. "గ్రహంనుబట్టి దేవునికి వందనస్థురాలను. అంతే సమానంగా గొప్ప భర్త, గొప్ప తండ్రి, ప్రతి విషయంలో స్తుతించేవాడు. ఆనందంగా ప్రశాంతంగా మెలిగేవాడు. డబ్బుకై ఎవరినీ యాచించేవాడు కాదు. మేము విశ్వాసంతో దైవ పరిచర్యలో ఏకమనస్కులం.

వారి సంతానం. ఒక పాప ఇద్దరు బాబులు. ఆ ముగ్గురిలో ఎస్తేరు 1985 నవంబరు 7న జన్మించింది. ఫిలిప్పు గ్రహం 1988 మార్చి 11న జన్మించాడు. తిమోతి 1992లో జన్మించాడు. ఉదకమండలం (ఊటి) హెబ్రోనులో వారిని విద్యకై పంపాడు. వారు సెలవులకు తల్లిదండ్రుల వద్దకు ఒరిస్సాకు వచ్చేవారు. వీరి ముగ్గురు బిడ్డలు దేవునిని, తోటివారిని ప్రేమించేవారు. వీరికి పాటలంటే కడు ప్రీతి. చిన్నవాడు 6సం॥ల వయస్సులోనే పాటలు వ్రాసి పాడేవాడు. ఫిలిప్పుది మిషనరీ హృదయం. అందరినీ ప్రేమించేవాడు. అభాగ్యులను అనారోగ్యంగలవారిని ప్రత్యేక శ్రద్ధతో చూచేవాడు. స్నేహితులు గాయపడినవేళ నేర్పరివలె కట్లు కట్టి ప్రథమ చికిత్స చేసేవాడు. కుష్ఠురోగుల పరిచర్యలో సహకరించేవాడు. మీటింగ్‌లకు కుర్చీలు వేసేవాడు.

www.gospelneeds.com

## మనోహర్‌పూర్‌లో చివరిరాత్రి

మహిమగల పరలోకాసీనుడిగానున్న దేవుని, ఆ పసిబాలుడు ఎంతగానో ప్రేమించాడు, ఆయనే రక్షకుడని నమ్మాడు. ఆ పసిబాలుడు నిజంగానే 6 సంవత్సరాల ప్రాయంలో లోకంలో ఏమీ అనుభవించకనే ఆ ప్రభుని చెంతకు చేరాడు. 1997సం॥ కుటుంబమంతా కలిసి ఆస్ట్రేలియా చూడాలని వెళ్ళారు. స్వల్పకాలంలోనే బిడ్డలందరితో తిరిగి ఒరిస్సాలోని గృహమే తమస్వంత గృహమని ఆ ఇల్లు చేరాకనే స్థిమితపడ్డారు.

గ్రెహంగారి చివరి రాత్రి, ఆ తర్వాత రోజు జనవరి 22, 1999 రాత్రి 12గం॥ల సమయంలో సంతాలీయులనేకులు ధాంగ్రీ నృత్యం చేయసాగారు. అసలు చీకటి అదేరాత్రి సజీవ దహనం జరిగిన కాళరాత్రి ఆ రాత్రి 11గం॥ వేళ, హంతకులైన జమద్ వార్‌నుండి ధారాసింగ్ అనే దుష్టవ్యక్తి, రబీంద్ర పాల్‌సింగ్ ఈ ఇద్దరి నాయకత్వంతో ఒక గుంపు బయలుదేరింది. ఆ హంతకుడైన రబీంద్రాకు నేరస్థునిగా 9సంవత్సరాలుగా నేరచరిత్ర కలిగి ఉన్నాడు, ఇతడు పోలీసు శాఖకు సుపరిచితుడు. కొన్ని తెగలు అతనికి అండగా నిలిచాయి. అతడే చివరిలో నేరస్థునిగా ఒప్పుకున్నాడు.

అవుట్ లుక్ అనే పత్రికకువార్తలు సంపాదించిన సౌతిక్ బిస్వాస్ చెప్పిన వివరాలనుబట్టి మనోహర్‌పూర్ గ్రామస్థునికి తానే స్టెయిన్స్‌ను చంపానని ధారాసింగ్ చెప్పినట్లుంది. తరువాత ఇదంతా ఒక కుట్ర అన్నట్లు పేర్కొన్నారు. ఆ రాత్రి పొలాలనుండి లాఠీలతో, త్రిశూలాలతో పరుగు పరుగున ఆ ప్రదేశానికి చేరారు. వారు గురిచూచింది వ్యాన్ మాత్రమే. గట్టిగా అరవడం మొదలు పెట్టారు. చేతిలోని గొడ్డలితో వ్యాన్ టైర్లు గాలి తీసారు. కిటికీలు పగులగొట్టారు. వ్యానులోవారిని పారిపోకుండా చూచారు. గ్రెహంగార్ని, ఇద్దరిబిడ్డలను దారుణంగా కొట్టారు. త్రిశూలాలతో పొడిచారు. వ్యాన్‌క్రింద ఎండు గడ్డిపెట్టి నిప్పు పెట్టారు.

గ్రెహంగారు తన యిద్దరి బిడ్డలను కౌగలించి పట్టుకున్నారు. గుండెల్లో దాచుకొని గుసగుసలు చెప్పి ధైర్యం కల్గేలా తప్పక ప్రార్థించి ఉండే ఉంటారు. క్రీస్తు శ్రమలకు తాముఅర్హులమని ఆయనకు పూర్తిగా తెలుసు. ఆయన పెదవులపై ఉచ్చరించిన ఒకే విలువైన, ఘనమైన నామము "యేసుక్రీస్తు" మాత్రమే. ఆ హంతకులు ముగ్గురి మరణాన్ని కళ్ళారా చూచారు. ఆ మంటల్ని ఆపాలని కొందరు ప్రయత్నించగా, వారిని బెదిరించారు. యీ అనుభవానికి ముందు జరిగిన వివరాలు మరొక స్నేహితుడు ఇట్లు తెల్పాడు.

www.gospelneeds.com

"ఆ రాత్రి 9 గం॥ల సమయంలో గ్రెహం అతనితో పాటు ఉన్నవారు రాత్రి భోజనం ముగించారు. రాత్రి 9.45 ని॥లకు గిల్బర్ట్ అనే విదేశీయుడు కూడా వారితో ఉన్నాడు. వారందరూ గుడిసెలలో పండుకున్నారు. వీరు వ్యాను ప్రాంతానికి 200 మీ॥ల దూరంలోనే ఉన్నారు. అర్థరాత్రి కేకలు విన్పించాయి. తలుపులు బాదారు. 50 లేదా 60 మంది, మండుచున్న కాగడాలు చేతిలో పట్టుకొని వున్నారు. చంపండి, చంపండి, జిందాబాద్ అంటూ అరిచారు. గ్రెహమ్‌గారు తన యిద్దరు బిడ్డలు నిర్ధాక్షిణ్యంగా బాధింపబడ్డారు. 1గం॥ తర్వాత అందరూ దూరమయ్యారు. రూలియా నూరన్ నాయకత్వంలో సైకిళ్ళపై ట్రొగూర్ ముండలోని పోలీసుస్టేషనుకు ఈ వార్త అందించుటకై మనుష్యులను పంపారు. అది మనోహర్‌పూర్‌కు 18 మైళ్ళు మాత్రమే. దీనికి ప్రత్యక్ష సాక్షి గ్రెహంగారి డ్రైవర్ హస్థా. గత 20 సంవత్సరాలుగా అతడు స్టైయిన్‌కు తోటి పనివాడు. అతనే మంటలార్పుటకు ప్రయత్నించగా వారతన్ని తరమివేశారు. హస్థా తల్లిదండ్రులు కుష్ఠు రోగులు. గ్రెహం వారిని ప్రేమతో చూచి వ్యాధి నివారణ చేసినందుకు కృతజ్ఞతగా ఉండేవాడు. తన తల్లి దండ్రులను సంరక్షించిన వారిని కాపాడుకోలేక పోయినందుకు చాలా దుఃఖపడ్డాడు. "నన్ను కూడా వారు తమ బిడ్డలాగే చూసేవారు. నా పిల్లలు, వారి పిల్లలు సరదాగా ఆడుకొనేవారు. తండ్రిని, పసిపిల్లలను పొట్టనబెట్టుకున్నారని" హస్థా బిగ్గరగా ఏడ్చాడు.

"అంత భీభత్సంలోకూడా ఆ గ్రామస్తులు వింత కాంతి ఆకాశంనుండి తిన్నగా వ్యాన్ వెనుక ఉన్న స్థలంలో ప్రసరించుట చూచామని సాక్ష్యమిచ్చారు. ఈ వార్త తెలిసిన గ్లాడిస్ "నా భర్త, నా పిల్లలు నా దేవునిచేత, దూతల సమూహంచేత బలము పొందియుంటారనేది ముమ్మాటికి నిజం." అని కన్నీటితో స్తుతించారు."

యోహాను 16:33 లోకములో మీకు శ్రమ కలుగును నేను లోకాన్ని జయించాను. ధైర్యం తెచ్చుకోవాలని క్రీస్తు నేర్పారు. గ్లాడిస్ తన కుమార్తె యీ ఘోరమైన శోకాన్ని గుండెల్లో యిముడ్చుకొని ధైర్యంగా నిలిచారు.

గ్లాడిస్‌కు తన భర్త, తన కొడుకులు ఇక లేరన్న బాధ తన విశ్వాస జీవితానికి విషమపరీక్షయే. గ్రెహం అన్నగారు గుండెల్ని పిండే బాధతో కృంగిపోయాడు. ఆయన పలికిన మాటల్లో "హంతకులకు సిగ్గు కలుగునట్లు వీరిపై పగతీర్చుకోరాదు." అన్నాడు.

www.gospelneeds.com

క్రైస్తవులు క్రియను బట్టియే కాక ప్రతిక్రియలను బట్టి తెలియబడతారన్న మాట నిజమే. ఈ ప్రపంచానికి స్టెయిన్స్ యింటివారు నిజమైన క్రైస్తవ విశ్వాసుల సాక్ష్యమెట్లుండాలో లోకానికి ప్రదర్శించారు. రెండు రకాల సాక్షులను చూడగలము. త్యాగం చేసిన హతసాక్షులు గ్రేహంగారు వారి యిద్దరు బిడ్డలు కాగా, గ్రేహం భార్య గ్లాడిస్ ఆమె కుమార్తె ఎస్తేరు, యిద్దరూ కఠిన శ్రమలో శత్రువులపై చూపిన ప్రేమ. తోటి కుష్ఠురోగుల పరిచర్యలో అంకితమగు త్యాగం మరువరానిది.

**ఆమె జన్మ స్థలం, బాల్యం, మరియు సేవకై పిలుపు**

గ్లాడిస్ జన్మస్థలం ఆస్ట్రేలియా. ఆమె 1964 సం॥లో ఫ్లిండర్స్ కాంగ్రిగేషనల్ చర్చిలో కెల్ విల్లిస్ వాక్య పరిచర్యద్వారా తన 13వ సం॥లో క్రీస్తును స్వంత రక్షకునిగా స్వీకరించింది. బ్రదరన్ అసెంబ్లీ కాగా విద్యాభ్యాసము నర్స్ ట్రైనింగ్ మాత్రమే. అందరూ అసహ్యించుకునే అంటరానివారిగానున్న కుష్ఠువారిపై క్రీస్తు ప్రేమ ఆమెను ఆకర్షించి అయోగ్యులకు సేవ చేయుటలో తర్ఫీదు పొందింది. అంతర్జాతీయముగానున్న సేవా సంస్థలో పనిచేయుటద్వారా వివిధ దేశాలతో అనుబంధమేర్పడి

భారత దేశాన్ని దర్శించే అవకాశం కల్గింది. ఆ కాలంలోనే గ్రేహంగారితో పరిచయము ఏర్పడినది. ప్రభువు తన భాగస్వామిని మన దేశంలో భారత దేశంలోనే కలుసుకోగల భాగ్యాన్నిచ్చారు. గ్రేహం ఆస్ట్రేలియానుండి ఇండియాకు మిషనెరీగా వచ్చిన సేవకుడు. వారిద్దరి నివాసాలు 30 కి॥మీ దూరమైనా కలుసుకోలేని అనుభవమైనా, దేవుని దివ్య ప్రణాళికలో ఏకమయ్యారు. అది క్రైస్తవ నాయకుల ప్రార్థనా ఫలితమే.

గ్రేహంయెడల భార్యకుగల భావం గొప్ప మిషనెరీ అనియు, మంచి భర్త, మంచి తండ్రి, దయా స్వభావి, మృదుశాలి, దైవ కార్యాలపట్ల ఆసక్తిగలవాడని, బిడ్డల ప్రేమకొరకు ప్రత్యేక సమయాన్ని వినియోగించేవాడని తెలిపింది. వారిద్దరి వివాహ జీవితకాలము 16సం॥లు మాత్రమే. సామెతలు 31లోని వివరాలన్నీ గ్లాడిస్ ధన్యజీవిగా పొగడ్తలకు అర్హురాలు.

వీరిద్దరి విశ్వాస లక్షణం, గురి ఒక్కటే. అది ఆత్మల సంపాదన, క్రీస్తు ప్రేమ క్రియారూపంగా చూపి అభాగ్యుల సేవలు. వారి యిష్టాలు ఒక్కటే. మయూర్‌భంజ్ కుష్ఠురోగుల కేంద్రంనుండి శ్రీమతి గ్లాడిస్ జాన్ స్టెయిన్స్

www.gospelneeds.com

వ్రాసిన కొన్ని మాటలు ఎంత శ్రేష్టమైనవి! భర్త మరణం జనవరి 22న సంభవానికి ముందు ఆమెను మానసికంగా శ్రమకు దేవుడే సంసిద్ధం చేసారు.

**ఒకరోజు గ్రెహమ్ గారి భార్య స్వీయానుభవం**

నేను ఉదయకాల ధ్యానమాలికలో ఇట్లు ధ్యానించితిని. యేసే ఆశ్రయుము, నా శక్తి, కటిక చీకటిలో వెలుగునిచ్చువాడు. ఈ నా జీవితము ఆయనదే. క్రీస్తే నా మంచి కాపరి. నాకు దేనికి కొదువలేదు. నా ప్రభువు నాతో ఉన్నాడు. గాఢాంధకారపు లోయలో సంచరించినను ఏ అపాయానికి భయపడను. నేను ఎవరినీ ద్వేషించను. భారత దేశంలో ప్రతి వ్యక్తి క్రీస్తు తనను ప్రేమిస్తున్నాడనే సత్యం తెలిసికోవాలి. ఆయనను నమ్మాలి. ద్వేషాన్ని కాల్చి ప్రేమ జ్వాల రగిలించాలి. క్రీస్తు ప్రేమ జ్వాల అంతటా జ్వలింపజేయాలి. క్రీస్తు ప్రేమ, దయ, పరిచర్యలు చేయుటకు సేవకులు లేవాలి. ముందుకు రావాలి. మనము క్రీస్తు పట్ల గల ప్రేమను కొలిచేది తోటివారికి చేయు సేవయే. గనుక అట్టి సేవలో సంతోషము సమాధానంతో జీవించాలని నా ప్రార్థన".

భక్తిగల భర్తకు తగిన భార్యగా క్రీస్తు ప్రేమను సంపూర్ణంగా ఆకళింపుచేసికున్న ధన్యమహిళగా అనేకులచే అభినందనలందుకున్న ఆదర్శ మహిళ గ్లాడిస్. గొప్ప విశ్వాసులుగానున్న మిషనెరీ హతసాక్షుల జీవితాలు, సామాన్య క్రైస్తవుని ఉత్తేజపర్చి క్రీస్తుపై అపార ప్రేమ పెంపొందేలా సహకరిస్తాయి. హతసాక్షిగా క్రీస్తుకై తన జీవితాన్ని మౌనంగా సమర్పించిన గ్రెహమ్‌గారు సజీవ దహనమై తన బిడ్డలను హత్తుకొని పరలోకాన్ని చేరిన గొప్ప సాక్షి. వారిజీవితం అభినందనీయం. "ఎన్నో సంవత్సరాలు కుష్ఠరోగులకొరకు తమ జీవితాన్ని వెచ్చించి, సేవ చేసినవారికి కృతజ్ఞత చూపలేదు సరికదా, ఈ విధమైన మరణానికి అక్కడున్నవాళ్ళు కారకులయ్యారు. హిందూదేశం మతసహనానికి, మానవత్వానికి పెట్టినది పేరు. ఈ ఘాతుక చర్య ప్రపంచపు చీకటిక్రియల ఉత్పాదనేమో అనిపిస్తుంది." అని అప్పటి రాష్ట్రపతి తన ఆవేదనను పలికిరి. హెబ్రీ 2:10.

కాల్చబడుటకు తమ శరీరాలనప్పగించిన వారిని హతసాక్షుల శ్రమలద్వారా దేవుడు సంపూర్ణులనుగా చేసారు. గ్రెహెమ్‌గారి భార్య, భర్త ఆకస్మిక మరణం, తన యిద్దరి కుమారుల మరణం, గొప్ప విశ్వాసిగా ఎదుర్కొనుట క్రైస్తవ విశ్వాసానికే వన్నెతెచ్చింది. ఆ యిబ్బంది కొలిమిలో ఆమెను పరీక్షించాడు దేవుడు.

www.gospelneeds.com

"నాలో ఉన్న కొలిమిని దేవుని ఊపిరి ఊదుతుంది. ఎర్రగా కాలిన హృదయాన్ని బండపైవేసి బరువైన సుత్తెతో బాదినప్పుడు దేవుని చిత్తప్రకారమే జరుగుతుందని గ్లాడిస్, గ్రెహమ్ ఆమె ఏకైక పుత్రిక ఎస్తేరు కూడా విశ్వసించి యోబువలె, సైఫనువలె మౌనంగా తలవంచారు. గ్రెహంగారు తనబిడ్డలు అగ్నికాహుతియై కన్నీరే లేని, కష్టాలేలేని ఆకలి బాధలు లేని, ఆనందతరంగాలలో తేలియాడే పరలోక నిత్యనివాసంలో ఉన్నారు. అయితే అగ్ని గుండంవంటి మండే నరకాగ్నిబాధలో నుండి దాటుటకు అంతులేని విశ్వాసం కావాలి. అల్పవిశ్వాసం పనిచేయదు. నిశ్చలమైన విశ్వాసిగా నిలిచింది గ్లాడిస్. విశ్వాసి తన గమ్యం చేరడానికి అగ్నివంటి శ్రమలు ఒక రాజ మార్గమే. శ్రమలద్వారా మహిమలో ప్రవేశిస్తారన్న పాఠం గ్రెహం కుటుంబానికే తెలుసు. గ్రెహమ్ స్టెయిన్స్‌గారు, ఆయన సతీమణి గ్లాడిస్ గ్రెహమ్ భారత దేశాన్ని ప్రేమించి మిషనెరీలుగా కుష్ఠురోగుల మధ్య గణనీయమైన సేవ చేయడానికి దేవుని చిత్తాన్ని సంపూర్ణంగా కనుగొనగల్గి ఒరిస్సా ప్రవేశించినారు. ఆ స్థలంలోనే వారివివాహం జరిగింది. అల్పకాల భోగాలాశించక బిడ్డలతో సామాన్య జీవితం కొనసాగించారు. దైవ వాక్కును నమ్మి క్రియాత్మకంగా నిరూపించగల సైఫను జీవితాన్ని వారు అనుకరించారు. శ్రమలు వారి తలుపుతట్టినప్పుడు క్రీస్తు మాటలు ఉచ్చరించారు. "వీరేమి చేస్తున్నారో వీరికి తెలియదు అని ప్రభువు క్షమించే నేర్పు క్రీస్తే వారికి నేర్పారు. అందుకే క్రీస్తు బోధలు భిన్నమైనవి. మత్తయి 5 అధ్యాయము జనులు మిమ్మును శ్రమ పాలు చేస్తారు. మీరు నా నిమిత్తము సకల జనులచే ద్వేషింపబడతారు. సాత్వికులు ధన్యులు. దీనులు ధన్యులు. గ్లాడిస్, తన భర్త, తన యిద్దరు పుత్రులు సజీవ దహనము గావించబడిన వార్త విన్న వెంటనే. "సార్వ భౌముడైన దేవుని చిత్త ప్రకారమే నా భర్త నా పిల్లలు మరణించారు." అని పలికింది. యీ మాట విశ్వాసులకు సవాలువంటిది.

గ్లాడిస్ జరిగినదంతయు ఆయన చిత్తములోనే జరిగిన సంఘటనగా గుర్తించగల్గిన ఆత్మసైర్యంగలది. ప్రభువు ఆమెనిట్లు అభినందించును భళా, నమ్మకమైన మంచి దాసురాలవు. యోబు, యోసేబు శ్రమలలో నిబ్బరంగా నిలిచారు. ఎదిరించి ప్రశ్నించనేలేదు. యీ మరణాల వార్త యావత్‌ప్రపంచాన్ని మేల్కొలిపింది. వారు హతసాక్షులయ్యే ధన్యత పొందారు. హతసాక్షుల రక్తం క్రైస్తవ సంఘానికి పునాది విత్తనాలు. సైఫను సాక్ష్యం పునరుద్దీకరించారు.

www.gospelneeds.com

అది నిర్లిప్తంగా నిలిచిన క్రైస్తవుల విశ్వాసాన్ని తట్టి మేల్కొలిపింది. ఎర్రని మంటల మధ్య మరణాన్ని కల్గించిన ఆ జ్వాలల వేడి అందరినీ తాకిందా అనిపించింది. శ్రమలకు విజయమార్గం చూపింది. పగను పగతోగాని, ద్వేషాన్ని, హింసను రక్తపాతంతో గాని ఎదుర్కోనక్కరలేదని నేర్పింది. సైఫనునుండి స్టైయిన్స్ వరకు క్రైస్తవ చరిత్రకు హతసాక్షులు కిరీటంగానున్నారు. ఇటువంటి శ్రమలకు ఆశ్చర్యపడనవసరములేదని పేతురు స్పష్టంగా హెచ్చరించారు. 1పేతురు 4:12

ప్రియులారా, మిమ్మును శోధించుటకు మీకు కలుగుచున్న అగ్నివంటి మహాశ్రమలనుగూర్చి మీకేదోయొక వింత సంభవించునట్లు ఆశ్చర్యపడకుడి. క్రీస్తు మహిమా సమయంలో ఆనందం ఉంటుంది. అందుకే సంతోషించాలి మీరు నిందపాలైతే ఆత్మ మీమీద నిలుస్తుంది. మీరు నిజంగా ధన్యులు అట్టి విలువైన సందేశాలతో ధైర్యం కల్గించారు. అంతేకాదు 1యోహాను 5:19, ఎఫెసీ 6:12 ను బట్టి మనము లోకనాధులతో పోరాడాలి. సైతానును ఎదురించుటకు ప్రతిరోజు సర్వాంగ కవచాన్ని ధరించాలి. సైఫను (ప్రార్ధన), క్రీస్తు ప్రార్ధనలలో "తండ్రీ వీరేమి చేయుచున్నారో వీరికి తెలియదు గనుక వీరిని క్షమించండి" అన్న మాటలో వారికి నిజంగా తెలియదా? ఒక కోణంలో ఆలోచిస్తే వారికన్నీతెలుసు. ఆధ్యాత్మికంగా ఆలోచిస్తే, దేవుని రాజ్యం, ఆయన సుబోధల సారాంశం తెలియక, క్రీస్తు ప్రేమను అనుభవించక, నిత్యశిక్ష వివరాలు గ్రహించక, దీనతతో దేవుని ఆశ్రయిస్తే తగిన ప్రతిఫలము విలువలు, అనుభవం లేక వారు దుష్టులుగా ప్రవర్తించారు.

తన రాజ్యంయొక్క రూపురేఖలు క్రీస్తు బయలుపర్చారు. ఆ రాజ్య వారసుల లక్షణాలు, వ్యతిరేఖులు చేయు హింస చూపారు. కన్నీరు వెనుక అత్తరు వాసనవంటి సువాసనగల అనుభవాలకై నిరీక్షించాలని ఆదేశించారు.

క్రీస్తు రాజ్యంలో విమోచింపబడినవారు ఎంత రెచ్చగొట్టినా తిరుగబడరని గ్రహించాలి. తన్ను బాధించుచున్న లోకము కల్గియున్న ఆత్మకు భిన్నమైన ఆ ఆత్మ క్రైస్తవుడు కల్గియున్నాడు. ఆత్మ విషయమై దీనులంటే హెబ్రీ 11 అధ్యాయంలో వున్న సాక్షి సమూహాన్ని అనుసరించినవారే. వారందరి అనుభవాలు పరీక్షిస్తే, కొందరు యాతనపెట్టబడ్డారు. కొందరు తిరస్కారం, కొరడాదెబ్బలు, బంధకాలు, జైలు అనుభవించారు. రాళ్ళతో కొట్టబడ్డారు. రంపములతో కోయబడ్డారు. శోధించబడి ఖడ్గంతో చంపబడ్డారు. గొఱ్ఱె, మేక చర్మాలు ధరించి,

www.gospelneeds.com

దరిద్రులుగా శ్రమపడి అడవులలో, కొండలలో గుహలలో సొరంగములలో తిరుగాడుచూ సంచరించిరి.

గ్రెహం స్టెయిన్స్‌గారి కుటుంబము కనికరము గలవారు. హృదయ శుద్ధిగలవారు, సమాధానపర్చువారు, పరలోకాన్ని ఈ భూమిపై చూపించే దేవుని పిల్లలు, వారు దేవుని ప్రేమించేవారి జీవితాశయాల్ని గ్రహించలేక, అమానుష్యంగా సజీవ దహనం గావించిన కిరాతకపూరిత హింస అది కేవలం సైతాను ప్రేరణయే. మత్తయి 5:10,12. పూర్వమందు ప్రవక్తలనుకూడా హింసించారని యీ కుటుంబానికి బాగా తెలుసు. యోహాను 15:20.

లోకం నన్ను హింసిస్తే మిమ్ములను కూడా హింసిస్తుంది. నా మాట గైకొంటే మీ మాటలు వింటారని క్రీస్తు తెల్పారు. యోహాను 16:33

లోకములో మీకు శ్రమ కలుగును. అయినను ధైర్యం తెచ్చుకొనుడి. నేను లోకాన్ని జయించాను. శ్రమలో, ద్వేషంలో, బాధలో, మరణంలో ప్రతి క్రైస్తవుడు ధైర్యాన్ని సంతోషాన్ని కనుపర్చాలి అనే భావంతో గ్రెహం గారి ఏకైక పుత్రిక ఎస్తేరు సమగ్రంగా గ్రహించింది. బాల్యంలోనే ఆమె తన సృష్టికర్తను స్మరణకు తెచ్చుకుంది. "దేవునికొరకు

స్వకీయులను దూరం చేసుకుంటే పరలోకంలో మేలుంటుంది అని గ్రహించింది. "దేవునికొరకు చనిపోవడానికి నా తండ్రి యోగ్యుడుగా ఎంచబడినందుకు గర్విస్తున్నాను." ఈ అమూల్య అమృత వాక్యాన్ని తన తండ్రి, ప్రియతమ సోదరుల మృతదేహాల చెంత పల్కింది. అవి అద్భుత వాక్కులే. యీ సజీవ దహనం పుస్తక సమీక్ష, క్రైస్తవ విశ్వాసపు లోతుల్లో సాగిపోవుటకును, వీరు యీ దేశానికి ముఖ్యముగా జరిగించిన అభాగ్యులైన కుష్ఠరోగులపట్ల త్యాగపూరిత అమూల్య పరిచర్యను వారి అంకిత భావంతో దేవుని చిత్తాన్ని గ్రహించిన తీరు ప్రతి విశ్వాసియొక్క మనస్సాక్షి వారిని సరియైన గొప్ప కార్యాలు తలపెట్టి, చేయు కృపనివ్వాలనేది దేవుని ఆశయం.

"నిన్ను పిలిచిన పిలుపుకు నమ్మకము కల్గియుండుము. "వెళ్ళి పొమ్ము" "వదలి వేయము" అనే శోధనలకు, భయము హింసలకు, లొంగవద్దు" యివే, గ్లాడిస్ స్టెయిన్స్ వాక్కులు. గ్లాడిస్ గొప్ప సందేశాన్ని యిచ్చుటకు, భర్త, బిడ్డల మరణాన్ని నిబ్బరంగా తట్టుకున్న విధము ఆత్మీయ పరిపక్వతకు పునాది.

www.gospelneeds.com

## భూస్థాపన

ఒరిస్సాలోని కటక్‌లో శవపరీక్ష జరిగిన తర్వాత పూలతో ఆ శపేటికలను అలంకరించారు. దొరగారికి అంతిమ నివాళులర్పించాలని వేలాది ప్రజలు విచ్చేసారు. యీ వార్త విని చలించి వారి అంతిమ నివాళలర్పించాలని వివిధ ప్రాంతాలనుండి అక్కడికి చేరుకొనిరి. రాష్ట్రంలోని దుకాణాలు మూసివేసారు. ఆనాటి కార్యక్రమాలన్నీ రద్దుచేయబడ్డాయి. ప్రభుత్వ ఉద్యోగులు ప్రదీప్ మొహంతీ మరియు ప్రముఖులు అనేకులు విచ్చేసారు.

ఈ భూస్థాపన సామాన్యమైనది కాదు. విభిన్నమైనదే. ఎందువలననగా సామాన్యంగా బంధువులు స్నేహితుల రాకకు బదులుగా స్థానికులు అనామకులు, సామూహికంగా చక్కని క్రమంలో జరిపించారు. సమస్త ఏర్పాట్లు దేవుడే నిర్వహించాడు. సమృద్ధియైన దేవుని కృపతో అతి చిన్న, పెద్ద పనులన్నీ సవ్యంగా సమాప్తమయ్యాయి. విశేషంగా గ్లాడిస్‌గారు తనను ఓదార్చేవారు దుఃఖిస్తుండగా ఆమె వారిని ఓదార్చారు. బైబిలులో యోహాను 14 అధ్యాయము కీర్తనలు 91 వంటి ఆదరణ వాక్యాలు చదివి వినిపించి సంతాలీ భాషలో పాటలు పాడారు. భూస్థాపనకు విచ్చేసిన జన సమూహాలు కన్నీరు కార్చాయి.

ఆమె తన జీవితంలో జీవముగల దేవుని వాక్యాన్ని నమ్మి, ప్రతి వాగ్దానాన్ని స్వతంత్రించుకొనిన అనుభవంలో విశ్వాసయాత్ర ఒంటరిగా, ధీరురాలిగా ఆరంభించింది. ఆమె పాడిన పాట పలువురి హృదయాన్ని ద్రవింపజేసింది.

దీనుడైన యేసువంటి మిత్రుడు ఎవరూ లేరు. ఒక్కరైనా లేరు. మన ఆత్మరోగాలు బాగుచేయువారు ఒక్కరైనా లేరు. యేసు మన బాధలన్నీ యెరుగును. దినారంభంనుండి అంతంవరకు నడిపించేది యేసే. మనకు దేవుడు సమీపంగాలేని ఘడియలేదు. ఇంత నిశీధరాత్రి మరొకటిలేదు. అయినను, యేసు ప్రేమ త్రాణ పుట్టించును." పాట మధ్యలో తన ముద్దుల బిడ్డల రూపం లేని వారి శవపేటికలు చూస్తూ" తిమోతి చిన్న బాబుకు గులాబీలంటే ఎంతో ప్రీతి. ఎన్నో పూలతో అలంకరించుట బాగుంది అంటూ గ్లాడిస్‌గారు ప్రశంసించారు.

రోమా 8:38, మరణమైన హింసయైన మరి యేదైనా క్రీస్తు ప్రేమనుండి ఎడబాపునదేమీ లేదనే వాక్యం వీరిపట్ల అక్షర సత్యము. యేసు ప్రేమ నిత్యం నిలిచేది. సూర్యుడున్నంత కాలము చిగిర్చేదే. రేపటిని ఎదుర్కొనగల నిరీక్షణ నిచ్చేదే. ఆ నిత్యమైనది క్రీస్తు ప్రేమయే. మరణవార్తనందుకున్న గ్లాడిస్ నిబ్బరంగా నిలిచింది.

భర్త మరణించాడు. తన యిద్దరు బిడ్డలను పట్టుకొని, ముగ్గురు కలిసి సజీవదహనకాండలో ధగ్ధమై బూడిదగా మిగిలారని, మూడు ఆకారాలు బూడిదగా స్పష్టంగా కౌగలించిన రూపాలు కన్పించాయని యీ వివరాలు వెంటనే తెల్పుటకు ప్రజలు భయపడి, వ్యాను మాత్రం కాలిందని చెప్పారు. ఆ తర్వాత తెలుసుకున్న ఘోరవార్తను అశనిపాతకంగా తగిలింది. కాస్త తేరుకొని తమ ఏకైక కుమార్తెను కన్నీటితో కౌగలించుకొని “అమ్మా, ఎస్తేర్, యిక మనమిద్దరము ఒంటరిగా మిగిలాము 14 జనవరి 1999 వాక్య ధ్యానంలోని సందేశం అమెకు ఓర్పు ధైర్యాన్నిచ్చింది. ఒక గ్రుడ్డి పాప అనుభవం ఆమెను మానసికంగా స్పందింపచేసింది.

ఒక 12సం॥ల వయస్సుగల గ్రుడ్డి పాప కంటి చూపు క్రమేణా పోగొట్టుకుటుంది. ఆ స్థానిక పాస్టరుగారితో “అయ్యా, నా చూపును దేవుడు తీసికుంటున్నాడు” అని చెప్పింది. వెంటనే పాస్టర్ గారు “జెస్సీ తీసికొననీయకు తిరిగి దేవునికిచ్చివేయి.” అంటాడు. ఆ భాగము చదువగానే” నా భర్త, నా పిల్లలు, సమస్తాన్ని దేవునికై యిచ్చివేయగలనా? ఆ ప్రశ్న దేవుడడిగినట్లు భావించింది. తెలియకనే కళ్ళల్లోనుండి కన్నీరు కారాయి.

ప్రభువా నాకున్న సమస్తము నీకు సమర్పిస్తున్నాను” అని ప్రార్ధించింది. అబ్రాహాము, ఇస్సాకును బలిగా యివ్వలేదా? అట్లే దీవెనకర్తయగు దేవుడు ఆమెను అసాధారణరీతిగా బలపర్చాడు. ఆమె తనపెద్దకుమారుని తలంచి దుఃఖిస్తూ ఆలోచింపసాగింది.

పాస్టరుగారు లేచి సంఘంలో సండేస్కూలు పిల్లల పేర్లు పిలిచినప్పుడు 14 సం॥ల పేద బాలిక ఆహ్వానింపబడింది. తరచుగా ఆమె ఆత్మీయ మేలుపొందింది. కాని ఒకరోజు హాజరు కాలేదు. పేర్లన్నీ పిలువగా ఆమె హాజరుకానందున ఎంత బాధపడిందో ఆలోచిస్తూ, పరలోకంలో “దేవా నా పేరు పిలువ బడుచుండగా నేను హాజరు కావలెనని” అక్కడే ప్రార్ధించి యింటికి వెళ్ళాడు. యింటి వద్ద అతడు ఈ ఆలోచనలో ఉండగా నీవే ఒక పాట ఎందుకు వ్రాయకూడదు? అనే భావం వెంటాడినట్లుగా 15ని॥ల్లో పాట వ్రాసి ముగించాడు. తన భార్య దానికి సంగీతం జతచేసింది. ఎట్టి మార్పులేక ఆ పాట అనేకుల అభిమానాన్ని పొందింది. ఈ పాట గ్లాడిస్ గార్ని మరొకసారి గుండెల్లోతుల్లో తాకి, క్రీస్తు హాజరుపట్టి పిలిచినప్పుడు పేరుందని చెయ్యెత్తి పిలిప్పు, వెళ్ళిపోయే వయస్సు కాదు గానీ నా బిడ్డలిద్దరి పేర్లు నా భర్తతోపాటు పిలువబడ్డాయని

www.gospelneeds.com

తలంచింది. స్టెయిన్స్‌గారుకూడా యీ ఆకస్మిక మరణానికి సిద్ధపడ్డారని తలంచింది. ఎందువలననగా ఆయన చివరిగా చదివిన పుస్తకము హతసాక్షి గురించియే. జంగిల్ ఫైలెట్ 1956లో హతమార్చబడ్డాడు. ఈ మారణహోమంకు బలైన తనవారిపట్ల ప్రభువు చిత్తముందని గ్రెహం భార్య, ఎస్తేరు క్షుణ్ణంగా గ్రహించారు.

"హిందూ దేశం వదలి వెళ్ళిపోతారా? అమ్మగారూ" అని అమాయకంగా బెంగతో కుష్ఠువారు ప్రశ్నించారు. "వెళ్ళనే వెళ్లను. నా భర్త, నా పిల్లలు ఈ దేశంకోసం వాళ్ళ ప్రాణం త్యాగం చేసారు. హిందూ దేశం నా దేశము. యిక్కడ వుండడం నా కెంతో సంతోషము. క్రైస్తవ జీవితంలో అతి ప్రాముఖ్యమైనది దేవుని చిత్తాన్ని తెలిసికోవడం. నేను యీ దేశాన్ని చేరక ముందే దేవుని పిలుపును నమ్మాను. ఒరిస్సాలో నాకు కుష్ఠురోగుల సేవయే దేవుని సంపూర్ణ చిత్తమని తెలిసికున్నాను. నేను విశ్వసించిన నా క్రీస్తును రుచిచూచి యెరిగితిని. ప్రభువు నన్ను తన దగ్గరకు పిలుచువరకు ఈ సేవలోనే నన్నుంచగలరు. బైబిల్ ప్రకారము శరీరాన్ని వదలి దేవుని సన్నిధిలోనుండుటయే క్రైస్తవుని మరణము గురి. మంటలు లేని పరలోకం నన్ను ఆహ్వానించడానికి సిద్ధంగా ఉంది. మిషన్ ఫీల్డులో మలేరియా, పచ్చకామెర్లు, కలరా వ్యాధులకు గురికాకుండా మతద్రోహుల చేతిలో సాక్షులుగా మరణించుట ప్రభువుకు ప్రీతికరము. ప్రతి ఒక్కొక్కరిని దేవుడు తన లక్ష్యంకొరకు పిలుస్తాడు. యిచ్చిన కార్యం ముగించిన పిదప దేవుడు తనతో ఉండడానికి వాళ్ళను తన గృహానికి పిలుస్తాడు. రేపటినిగూర్చి భయం లేదు. పేదవారికి, కుష్ఠురోగులకు సేవ చేయాలని పిలిచిన దేవుడు వారిని ఎంతో ప్రేమిస్తున్నాడు. వారు దేవునికెంతో ప్రశస్తమైనవారు. నా భర్త, నా పిల్లలు వీరిని ప్రేమించారు. అట్లే నేను ప్రేమిస్తున్నాను. క్రీస్తే నా శక్తి, నా ఉనికి. హెబ్రీ 13:5, నిన్ను విడువను ఎడబాయననే వాగ్దానం నా కిష్టం. తన కిష్టమైన పనివారిని సేవకై ప్రభువు పిలుచుకొని మధుర వాసనలు వెదజల్లే త్యాగపూరిత జీవితం జీవించాలని కోరుతున్నారు. నన్ను పిలిచిన పిలుపుకు నేను నమ్మకంగా ఉండాలి. విడిచిపెట్టు, వెనుకకు వెళ్ళు అనే శోధన శ్రమ, బెదిరింపుకు లొంగరాదు.

గ్లాడిస్‌గారి సందేశ సారాంశమంతా ఆ ప్రాంతీయు లందరికీ అవగాహనయ్యింది. "దేవుడు గొప్పవాడు. మేము అనాధలుగా విడువబడలేదు." అని వారు దేవుని స్తుతించి, మరింత ప్రేమతో గ్లాడిస్‌కు నేడు తమ సహకారా నందిస్తున్నారు.

www.gospelneeds.com

గ్లాడిస్ యింటిలోని పటంలో ఒక మంచి మాట ఉంది. **దేవుడే నా కాశ్రయం, నా దుర్గం.** మన దేవుడు తమ ప్రాణాలను సహితం యిష్టంగా అర్పించే త్యాగవంతులు, నీ చిత్తమే అని అంతమువరకు సహించి దేవుడు యోగ్యుడని నమ్మే విశ్వాసులకై ఎదురు చూస్తున్నాడు. హెన్రీ భక్తుడు చెప్పినట్లుగా "తన చిత్తము నెరవేర్చుటకు సంపూర్ణముగా లోబడువారిద్వారా దేవుడు ఏమి చెయగలడో లోకం చూడవలసియున్నది."

నిజమే, మారుచున్న యీ లోకంలో మనుష్యులు మారినా మారునా నా ప్రభు యేసు ప్రేమ! మారనే మారదు. "సజీవ దహనం" సందర్భంలో పలువురు తమ భావాలు వ్యక్తం చేసారు. ప్రధానమంత్రి వాజ్‌పాయ్ గారు నేను సిగ్గుతో నా తలను దించుకున్నాను." అని పలికిరి. సుప్రీమ్ కోర్టు ఆధ్వర్యమున ఒక న్యాయ విచారణ కమిటీ ఏర్పాటు చేసారు.

ఇండియా టుడే పత్రిక అట్టపై దహించు అవమానం అని వ్రాశారు. అంతర్జాతీయ పత్రిక టైమ్స్ లండన్ వారిది, న్యూయార్క్ టైము, చికాగో ట్రి, బ్యూన్ టీ ఆస్ట్రేలియన్ సిడ్నీ మార్నింగ్ హెరాల్డ్" యీ చర్యను ఖండించాయి. హతసాక్షుల మరణ వార్త ప్రపంచాన్ని కుదిపేసింది.

వియాదవ్ జిల్లా సబ్ కలెక్టర్ అన్నారు "పట్టణానికి వెలుగైయున్నాడు. ఆస్ట్రేలియాలో గుర్తింపులేనివాడు. స్థానికంగా జీవించే కుష్ఠరోగులు కన్నీరు కార్చారు.

"మా ప్రపంచం చీకటిమయం మృత్యువును సమీపించేవారం. మేము ప్రయాణించినపుడు రాళ్ళు రువ్వేవారు. మనుష్యులను అంటరానివాళ్ళమని నీచంగా చూచేవారు. పూర్వజన్మ పాపంవల్ల వ్యాధి వచ్చిందని పురుగుల్లా అడవుల్లో చనిపోవాలని కోరుకొనేవారు. అయితే దొరగారు, అమ్మగారు మమ్ములను ఆప్యాయంగా చూచి మా పుండ్లు కడిగి మాకు క్రీస్తు బోధలన్ని కధలుగా వివరించి చెప్పేవారు. అంత దయగల బాబు మాకు దూరమయ్యాడు" అని ఏడ్చారు.

మిడ్ డే పత్రికవారు "మిలియన్ల హిందూ దేశస్థులు గ్లాడిస్‌గారితోను ఆమె కుమార్తె ఎస్తేరు వెంట ఉన్నారని" ప్రకటించారు. మార్కు 10:43,47.

ప్రముఖుడవ్వాలని కోరేవాడు దాసుడై యుండాలి. గ్రైహాంగారు అతని కుటుంబము కుష్ఠరోగులను మానవులుగా మార్చారు. వీరి మరణము క్రైస్తవ్యముకంటే మానవత్వానికే తీరని నష్టం. ఏ హిందూ కుష్ఠరోగులకు

www.gospelneeds.com

ఆయన సేవ చేసాడో వారు తమ ఆప్తబంధువుని పోగొట్టుకున్నారు. రోమా 12:14,17

మిమ్ములను హింసించు వారిని దీవించుడి. కీడుకు ప్రతికీడు ఎవరికినీ చేయవద్దు. 1యోహాను 4:4. చిన్నపిల్లలారా, మీరు దేవుని సంబంధులు. మీలో ఉన్నవాడు లోకంలో ఉన్నవానికంటే గొప్పవాడు గనుక మీరు వారిని జయించియున్నారు. రోమా 12:18-21 ప్రియులారా, పగతీర్చుకొనక ఉగ్రతకు చోటియ్యుడి. మేలుచేత కీడు జయించాలి. గ్రెహం స్టెయిన్స్‌గారి కుటుంబమే కాక కుష్ఠురోగుల సేవలో నిమగ్నమైన త్యాగశీలురున్నారు. వారిలో వేరా 42 సుదీర్ఘ సం॥ల సేవలో తన మధురమైన స్వభావంతో ఎందరినో తాకి సేద తీర్చింది.

స్టెయిన్స్ భార్య గ్లాడిస్ తాను నిజ క్రైస్తవురాలినని, యేసుక్రీస్తు అనుచరురాలినని లోకానికి ఋజువు చేసింది. ఆమెకు ఎంతో విషాదం ఎదురైనా, "నాకుఎవరిమీదా కోపంలేదు. వారు చేసిన ఆ తప్పు క్షమించబడాలి.

"నా దేవా, వీరు ఏమిచేయుచున్నారో వీరెరుగురు గనుక వీరిని క్షమించు" అని యేసుక్రీస్తు ప్రభువు చెప్పిన మాటలు ఆమె పలికారు. యేసు వార్తను చాటించగ లేచి రారమ్ము

ఓ క్రైస్తవా అని పాడుతున్నాము. లేమ్ము తేజరిల్లుమనే దేవుని స్వరాన్ని విందామా? వెళ్ళెదవా లేక పంపెదవా అను ప్రశ్నకు మన జవాబేమి? మందిరము పడియుండగా మందుడవై యుంటూ సరంబీ గృహాల్లో సంతోషించే సమయమా?

క్రీస్తు అనుచరులముగా పదండి ముందుకు ప్రియయేసు సేవకు సాగిపోదాం సర్వాంగ కవచంతో సైనికులముగా "కాల్చబడుటకై నా శరీరం అప్పగించినను ప్రేమలేనివాడనైతే వ్యర్థుడను అని అపో. పౌలు పలికినట్లు అవసరమైతే సజీవ దహనమగుటకు నీ చిత్తము ప్రభువా అని ధైర్యంగల విశ్వాసులంగా మనం సాగిపోదాం."

Share

A Gospelfamily Product



గాస్పల్ IND
ఫ్యామిలీ
www.gospelfamily.in

www.gospelneeds.com

Start

Gospel Haking



## want to work with our network




rewards




## Spread Gospel to India




IND Gospel Family

sent your Details to

gospelneedsindia@gmail.com

www.gospelneeds.com